

# పంచకల్యాణి

ఒక రాజు వద్ద వీరదాసు అనేవాడు కొలువు ఉండేవాడు. అతను తన రాజును భక్తి విశ్వాసాలతో సేవించి బాగుపడ్డాడు. రాజు అతనిపట్ల చాలా అభిమానంగా కూడా ఉండే వాడు. దురదృష్టవశాన ఒకసారి వీరదాసు కొడుకులు ముగ్గురికీ, రాజు కొడుకులతో కొట్లాట సంభవించింది. ఆ కొట్లాటలో రాజు కొడుకు ఒకడు చనిపోవటం కూడా తటస్థించింది.

ఈ సంగతి తెలియగానే రాజు వీర దాసును పిలిపించి, కఠినంగా మందలించి, "నీ కొడుకులు నా కొడుకులతో జగడానికి ఏమని దిగారు? నా కొడుకు చనిపోయి నందుకు నీ కొడుకులను ఈ క్షణం ఉరి తీయించగలను. కాని అందువల్ల పోయిన నా కొడుకు తిరిగి రాడు. అయినా వాళ్ళకు శిక్ష తప్పదు. నీకొక పని చెప్పబోతున్నాను. అది చాలా అపాయకరమైన పని. కాని నువు ఆ పని చెయ్యకపోతే నీ కొడుకుల ప్రాణాలు దక్కవు." అన్నాడు.

"నా కొడుకుల ప్రాణాల కన్న నాకు తమ ఆజ్ఞ నెరవేర్చటమే ప్రధానం. నేను చెయ్యవలసిన పని ఏమిటో సెలవియ్యండి," అన్నాడు వీరదాసు.

"శ్యామలనగరం రాజు దగ్గిర ఒక ప్రసిద్ధమైన పంచకల్యాణి గుర్రం ఉన్నది. నువూ, నీ కొడుకులూ వెళ్ళి ఆ గుర్రాన్ని పట్టుకు రావాలి. ప్రయాణానికి గుర్రా లిస్తాను. పని ఎలా చేసుకొస్తావో అది నీ ప్రయోజకత్వం మీదనే ఆధారపడి ఉంటుంది. నువు అప్రయోజకుడివి కావు. నాపట్ల నీకు అపారమైన విశ్వాసం కూడా ఉన్నది. అందుచేత నిన్ను నేను శత్రువుగా చూడటం లేదు," అన్నాడు రాజు.

"చిత్తం! రేపు ఉదయమే శ్యామల దేశానికి బయలుదేరి పోతాం," అన్నాడు

టి. వెంకటరావు



వీరదాసు. రాజు తనకు చెప్పిన పని అసాధ్యమైనదని అతనికి తెలుసును. శ్యామల రాజు ఆ గుర్రాన్ని తన ప్రాణం కన్న ఎక్కువగా చూసుకుంటాడు. దాన్ని ఆయన ఏ వెలకూ అమ్మడు; దాన్ని దొంగిలించటం మానవమాత్రులకు సాధ్యం కాదు: అలాటి ప్రయత్నం చేసినవారిని ఆ రాజు నిర్దయగా చంపేస్తాడు. కాని తన కొడుకుల ప్రాణాలు దక్కాలంటే వీరదాసు ఏదో విధంగా ఆ పంచకల్యాణిని తీసుకు రాక తప్పదు.

మర్నాడు ఉదయానికి రాజుగారు వీరదాసుకు బంగారు నాణాలు నింపిన సంచీ, నాలుగు గుర్రాలూ పంపాడు. వీరదాసూ, అతని కొడుకులూ ఆ గుర్రాల మీద శ్యామల నగరానికి బయలుదేరారు.

శ్యామల నగరం సముద్రతీరాన ఉన్నది. అక్కడికి దూర ప్రయాణమేగాక కష్టమయిన ప్రయాణం కూడానూ. వీరదాసు తన కొడుకులతో శ్యామలనగరం శివార్లలో ఉన్న దేవుడి మాన్యం చేరేసరికే చీకటి పడిపోయింది. పెద్ద గుడిచుట్టూ అనేకవేల యకరాలు దేవుడి మాన్యం. గుడికి సమీపంలోనే ధర్మకర్తగారి దేవిడీ ఉన్నది. దాన్ని అనుకునే ధాన్యాగారమూ, ఇతర కట్టడాలూ ఉన్నాయి. వాటికి ఒక పక్కగా గడ్డిమేట్లూ, ఊక బస్తాలూ, చిట్టు బస్తాలూ కొండల్లాగా కనబడుతున్నాయి.

వీరదాసు తిన్నగా ధర్మకర్తగారి దేవిడీకి వెళ్ళి, తననూ, తన కొడుకులనూ ఆ పెద్ద మనిషికి పరిచయం చేసుకుని, "మాకు మీ నగరం కొత్త. మేం ఒక రాచకార్యం మీద బయలుదేరి వచ్చాం. ఇప్పుడే చీకటి పడిపోయింది. అందుచేత ఈ రాత్రికి మా భోజన సదుపాయాలూ, పడకా మీరు ఏర్పాటు చేసినట్టయితే మీ ఋణం ఉంచుకోం," అని చెప్పాడు.

ధర్మకర్త వీరదాసు చేతఉన్న బరువైన సంచీకేసి చూసి, అందులో ఉన్నది బంగారమని గ్రహించి, అతిథులు ఎంతటి మర్యాదకైనా తగుదురని తెలుసుకుని, "మీరు

అంతగా చెప్పాలా? చాలాదూరం నుంచి వచ్చారు. ఈ రాత్రికి మీకు కావలసిన విధంగా జరుపుతాను. మీలాటి అతిథులు బహు అరుదుగా వస్తారు," అన్నాడు.

వీరదాసూ, కొడుకులూ సుఖంగా స్నానాలు చేసి, షడ్రసోపేతంగా భోజనాలు చేసుకున్నారు. కొడుకులను వెళ్ళి పడుకోమని పంపేసి, వీరదాసు ధర్మకర్తతో రహస్యంగా తాము వచ్చిన పనీ, దానికి ముందు నడిచిన కథా దాచకుండా చెప్పేసి, సలహా అడిగాడు.

వాళ్ళు పంచకల్యాణిని తీసుకుపోవటానికి వచ్చారని తెలియగానే ధర్మకర్త నిర్ఘాంతపోయాడు. ఆయన వీరదాసుతో, "అయ్యా, మీరు వృథాగా శ్రమపడ్డారు. మీరు తలపెట్టిన కార్యం జరిగేది కాదు. తెల్లవారుతూనే మీరు తిరిగి వెళ్ళవచ్చు. మా రాజుగారు ఆ గుర్రాన్ని మీకు అమ్మరు. దాన్ని దొంగిలించటం కూడా మానవ మాత్రుల తరం కాదు. తెలియక ఎవరన్నా అలాటి ప్రయత్నం చేసినా వారి ప్రాణాలు దక్కవు. నిజం చెబుతున్నాను," అన్నాడు.

వీరదాసు దీర్ఘంగా నిట్టూర్చి, "ప్రాణాపాయం గురించి ఆలోచించే స్థితిలో లేము, బాబుగారూ! పంచకళ్యాణిని తీసుకుపోకపోతే అక్కడ మా రాజుగారు చంపేస్తారు. కాకపోతే, మానవయత్నం లేకుండా చావటం మా కిష్టం లేదు. అందుచేత, ప్రాణాలు పోయినా సరే పంచకళ్యాణిని తస్కరించటానికే ప్రయత్నిస్తాం. మా రాజుగారి సేవలో





చచ్చా మన్న కీర్తి అయినా ఉంటుంది. రాజద్రోహు లనిపించుకుని చచ్చే దానికన్న ఇది మేలు కాదా? పోతే మాకు మీరు ఒక్క సహాయం చెయ్యవచ్చు. మమ్మల్ని ఎలాగయినా రాజుగారి అశ్వశాలలో ప్రవేశ పెట్టే మార్గం చూడండి. ఈ సంచీలోని బంగారమంతా మీ కిచ్చుకుంటాను. అశ్వశాలలో ప్రవేశించినాక మాపాట్లు మేం పడతాం!" అన్నాడు.

ధర్మకర్త చాలాసేపు ఆలోచించి, "ఈ రాత్రికే మిమ్మల్ని రాజుగారి అశ్వశాలలో ప్రవేశ పెట్టగలను. రాజుగారి గుర్రాల కోసం చిట్టూ, పొట్టూ బస్తాలలోకి ఎక్కిస్తున్నారు నా మనుషులు. ఆ బస్తాలలో పెట్టి మిమ్మల్ని కూడా పంపవచ్చు. కాని మీరు ఆ అశ్వశాల నుంచి ప్రాణాలతో బయట పడరు. మీ చావుకు నేను కారకుణ్ణి అవుతానే అని విచారిస్తున్నాను!" అన్నాడు.

"బాబుగారూ, మమ్మల్ని ఆత్మహత్య చేసుకుంటున్న వాళ్ళకింద జమ కట్టండి. మమ్మల్ని పొట్టు బస్తాలలో పంపారంటే మీకు పాపం రాదు సరికదా పుణ్యం వస్తుంది. మా మాట తీసెయ్యకండి," అని వీరదాసు ప్రాధేయపడ్డాడు.

ధర్మకర్త వారు నలుగురినీ తానే స్వయంగా గోతాలలో పెట్టి, వాటిని చిట్టుతో నింపి మూతులు కట్టి, తన నౌకర్లను పిలిచి, వాటిని కూడా బళ్ళమీది కెత్తించాడు. ఆయన వీరదాసుతో బంగారం ఉన్న సంచీని తన వద్దనే రహస్యంగా ఉంచుతాననీ, వీరదాసు తిరిగి వచ్చేటప్పుడు తప్పక తీసుకుపోవాలనీ అన్నాడు.

దాణా బస్తాలు శ్యామలనగరంలోని అశ్వశాలలోకి చేరేసరికి అర్ధరాత్రి అయింది. అశ్వశాలవాళ్ళు బస్తా లన్నిటినీ ఒక పక్కగా వేసి, వెంటనే నిద్రపోయారు.

అంతా సద్దుమణగగానే వీరదాసూ, కొడుకులూ గోతాలూ చించుకుని బయటికి వచ్చి, ఏ మాత్రమూ అలికిడి చెయ్యకుండా పంచకల్యాణి కట్టి ఉన్న కొట్టం కోసం వెతికి పట్టుకున్నారు.

పంచకల్యాణి మేలుజాతి అశ్వం కావటంచేత దాన్ని వాళ్ళు తేలికగా గుర్తించ గలిగారు. అది కూడా కొత్తవాళ్ళను చూడ గానే ఉద్రేకం చెంది, కళ్ళు పెద్దవి చేసి, చిన్నగా వణకసాగింది.

ఇదేమీ గమనించకుండా వీరదాసు చప్పున దాన్ని సమీపించి దాని మెడకున్న కట్టుతాడు విప్పబోయాడు. అతని చెయ్యి తగలగానే గుర్రం గట్టిగా సకిలిస్తూ, కాళ్ళు జాడించి వీరదాసునూ, ఆయనకు సహాయం వచ్చిన ఆయన కొడుకులనూ తన్నబోయింది. వాళ్ళు నలుగురూ దూరంగా పారిపోయి తమ తలలు పగలకుండా కాపాడుకున్నారు.

ఇంతలో రక్షకభటులు రానే వచ్చి, వీర దాసునూ, అతని కొడుకులనూ పట్టి బంధించి, అప్పటికప్పుడే రాజుగారి దగ్గిరికి తీసుకుపోయారు.

"వీళ్ళు పంచకల్యాణి కోసం వచ్చారా? తెల్లవారినదాకా అశ్వశాలలోనే బంధించి ఉంచండి. రేపు ఉదయం విచారణ చేద్దాం," అన్నాడు రాజు.

తెల్లవారగానే రాజు బందీలను తన ఇంటికి పిలిపించి, వారి కట్లు విప్పించి, కూర్చోమని మర్యాద చేసి, "మీ రెవరు? ఏ కారణం చేత ఈ అపాయంలో చిక్కుకున్నారు? మీ కథ అంతా చెప్పండి," అన్నాడు.

వీరదాసు ఏమీ దాచకుండా జరిగిన దంతా చెప్పాడు.

అంతా విని శ్యామల రాజు, "వీరదాసూ, ఇందులో నీ స్వార్థం ఏమీ లేదని నేను నమ్ముతున్నాను. కాని మీరందరూ ఈ క్షణాన చాలా అపాయకరమైన స్థితిలో ఉన్నారు. ఇంతకన్న అపాయకరమైన స్థితి నీకు ఎప్పు డైనా సంభవించిందా? సంభవించి ఉన్న ట్టయితే చెప్పు. దాన్ని నేను విశ్వసించ గలిగితే నీ కొడుకులలో ఒకణ్ణి ప్రాణాలతో వదిలేస్తాను," అన్నాడు.

వీరదాసు తన గత జీవితం జ్ఞాపకం తెచ్చుకుని, "సంభవించింది, మహారాజా," అన్నాడు.

"అదేమిటో చెప్పు!" అన్నాడు రాజు.

—(వచ్చే సంచికలో మొదటి కథ)





# పంచకల్యాణి

## 2

శ్యామలనగరం రాజు అడిగిన దానికి వీర దాసు ఇలా చెప్పసాగాడు:

ఇది నా బాల్యంలో జరిగింది. మా తండ్రికి విస్తారంగా భూములుండేవి, పెద్ద అవుల మంద ఉండేది.

ఒకనాడు దూరాన పొలాలలో ఒక ఆవు ఈనింది. మా నాన్న నన్ను ఆ అవునూ, దూడనూ ఇంటికి తీసుకురమ్మన్నాడు. నేను సూర్యోదయానే అక్కడికి వెళ్ళి, దూడను ఎత్తుకుని బయలుదేరాను. అవు నా వెనకాలే రాసాగింది.

నేను కొద్ది దూరం నడిచేసరికి పెద్ద పెట్టున వర్షం ప్రారంభమయింది. వర్షం నిలిచేదాకా ఎక్కడైనా నిలవవలిసి వచ్చింది. కొంత దూరంలో ఏదో గుడిసె కనిపిస్తే అందులో నేను దూడతోనూ, అవుతోనూ సహా తల దాచుకున్నాను.

కొద్ది సేపటికల్లా ఆ గుడిసెలోకి పన్నెండు పెద్ద పిల్లులు వచ్చాయి. వాటిలో ఒకటి మిగిలిన వాటికి పెద్దలాగా కనబడింది. ఆ పెద్ద పిల్లి మిగతా పిల్లుల కేసి తిరిగి అరవ నారంభించింది. పిల్లులన్నీ ఒక్కసారి కోలాహలంగా కూతలు పెట్టాయి. వాటి అరుపులు చాలా భయంకరంగా ఉన్నాయి. అలా అరిచి, అరిచి అవన్నీ అవుదూడ మీద పడి, కొద్ది సేపట్లోనే దాన్ని చీల్చి తినేశాయి.

నాకు వాటిని చూస్తే భయమూ కోపమూ కూడా వచ్చింది. వాటిని తరిమి కొట్ట బోయాను కాని నాకు సాధ్యం కాలేదు. అవి నా అదరింపులను ఏ మాత్రమూ లక్ష్య పెట్ట లేదు.

తరవాత అవి మళ్ళీ అన్నీ కలిసి పెద్ద పెట్టున భయంకరంగా అరిచాయి. వాటి

టి. వెంకటరావు

ఆకలి ఇంకా తీరినట్టు లేదు. ఈ సారి అవి ఆవు మీద పడి, ఎముకలు తప్ప ఏమీ మిగలకుండా తినేశాయి. నాకు భయం జాస్తి అయింది.

అవి మూడోసారి అరుపులు ఆరంభించే సరికి, ఈసారి వంతు నాదేనని తెలుసుకుని, కాలి సత్తువకొద్దీ అడవిలోకి పరిగెత్తాను. ఆ రాక్షసి పిల్లులు నన్ను తరుముకుంటూ వచ్చాయి.

అయినా నేను వాటికి అందకుండా పరిగెత్తిపోయి, గుబురుగానూ, ఎత్తుగానూ ఉన్న చెట్టెక్కి, వాటికి కనబడకుండా చిటారుకొమ్మ గుబురులో దాక్కున్నాను.

పిల్లులు నా జాడ తెలియక చెట్ల మధ్య చాలాసేపు కారాడాయి. ఆని ప్రాణం విసిగి వెళ్ళిపోతాయేమోనని ఆశ పడ్డాను. కాని పిల్లుల పెద్ద నేనున్న చెట్టు కిందికే వచ్చి, తల ఎత్తి నన్ను పసిగట్టి, పైకి చూస్తూ అక్కడే తిష్ఠ వేసింది. త్వరలోనే మిగతా పిల్లులు కూడా అక్కడికి చేరాయి. అవి నన్ను వదిలిపెట్ట దలచలేదు.

వాటిలో ఒకటి చెట్టెక్కి రావటం ప్రారంభించింది. అది నాకు అందుబాటులోకి వచ్చే దాకా ఆగి, నా దగ్గిర ఉన్న చాకుతో దాన్ని పొడిచి చంపాను. అది కాస్తా కింద ఉన్న తోటి పిల్లుల మీద పడింది.

దానితో పిల్లుల పెద్దకు ఆగ్రహం వచ్చింది. అది పాములాగా బుసకొట్టి మిగిలిన పిల్లులతో ఏదో అన్నది. వెంటనే పిల్లులన్నీ కలిసి, నే నెక్కిన చెట్టు వేళ్ళలో ఒక



పెద్ద వేరును తెంపటానికి దాని చుట్టూ తమ గోళ్ళతో తవ్వ నారంభించాయి. త్వరలోనే ఆ వేరు తెగి చెట్టు కొంచెం ఒరిగింది. చెట్టు పడిపోతున్నదని భయపడి, నేను చావుకేక ఒకటి పెట్టాను.

చెట్టు ఒరిగిందేగాని పడలేదు. పిల్లులు మరొక పెద్ద వేరును తెంపటానికి ఉపక్ర మించాయి.

అది కూడా తెగిపోయేసరికి చెట్టు మరి కొంచెం ఒరిగింది. నేను ప్రాణభయంతో మళ్ళీ చావు కేకలు పెట్టాను.

పిల్లులు ఇక మరొక వేరును తెంపే ప్రయత్నం ప్రారంభించాయి. ఈ పని పూర్తి అయేసరికి, చెట్టు ఒరిగి నేలమీద పడి పోయింది.

నేను మాత్రం ప్రాణభయంతో చెట్టు కొమ్మను గట్టిగా కరుచుకుని, పిల్లులకు ఆహారం కావటానికి సిద్ధపడ్డాను.

అయితే నేను పెట్టిన కేకలు వృథా పోలేదు. దూరాన చుట్టు పక్కల పొలాలలో పనులు చేసుకుంటున్నవాళ్లు నా కేకలు విని, పలుగులూ, పారలూ, కర్రలూ తీసుకుని నాలుగు వైపులనుంచీ పరిగెత్తుకుంటూ వచ్చారు.

వాళ్ళను చూసి పిల్లులు పారిపోబో యాయి. కాని రైతులు వాటిని చుట్టు ముట్టి ఒక్క దాన్ని కూడా మిగల్చకుండా అన్నిటినీ చంపేశారు.

వీరదాసు ఈ సంఘటన చెప్పి, "మహా రాజా, మీరు మమ్మల్ని నేరస్థులుగా విచా రించి ఉరి తీసిన దానికన్న ఆ రాక్షస పిల్లులు పీక్కు తినటం మరింత ఘోరం కాదా?" అన్నాడు.

"నిజమే, నీ కథ బాగానే ఉన్నది. ఇలాటిదే నీ జీవితంలో జరిగిన మరొక దారుణ సంఘటన చెబితే నీ కొడుకును మరొకణ్ణి క్షమిస్తాను," అన్నాడు రాజు.

వీరదాసు కొంచెం ఆలోచించి, "అలాటి సంఘటన మరొకటి ఉన్నది, మహారాజా!" అన్నాడు.

"ఉంటే చెప్పు," అన్నాడు శ్యామల రాజు. —[పై సంచికలో మరొక కథ]





# పంచకల్యాణి

## 3

శ్యామల నగరం రాజు అడిగిన దానికి వీర దాసు ఇలా చెప్పసాగాడు:

నేను కాస్త పెరిగాక, ఒకనాడు సముద్ర తీరాన కొండల్లో వేటాడబోయాను. ఒక నిటారుకొండ ఎక్కుతూండగా, దాని వెనక నుంచి పొగ పైకి లేస్తూ కనబడింది. ఆ పొగకు కారణం తెలుసుకుందామని కొండ చివరకు ఎక్కాను. ఒక కనుమ లోంచి ఆ పొగ వస్తున్నది. కనుమలోకి తొంగి చూసే సరికి, పొగకు ఊపిరిసలపక తల తిరిగి పోయింది. నేను ఆ కనుమలోకి దొర్లి పోయాను. అదృష్టవశాన దెబ్బలు బలంగా తగలలేదు. కాని ఆ కనుమ నుంచి ఎలా బయటపడాలో తెలియలేదు. ఎందుకంటే, కిందికి దొర్లిన కొండను ఎక్కడం నాకు సాధ్యంగా కనిపించలేదు. నేను తల ఎత్తి పైకే చూశానుగాని, పక్కలకు చూడనేలేదు.

ఇంతలో ఒక పక్క నుంచి ఏదో చప్పుడు వినిపించింది. అటు చూతును గదా ఒక రాక్షసుడు ఇరవై మేకలనూ, ఒక లేడినీ తోలుకుంటూ వస్తున్నాడు. వాడు వాటిని అన్నిటినీ ఒక గుహలోకి తోలి, నా దగ్గరికి వస్తూ, "వచ్చావా? నీ కోసం కత్తి నూరి ఉంచాను," అన్నాడు.

"ఛీ, ఛీ! నేననగా ఎంత? నీకు ఒక పంటి కిందికి చాలను. అయితే నీ కన్ను ఒకటి పోయినట్టున్నది. నేను కంటివైద్యంలో నిపుణుణ్ణి. పోయిన నీ కన్ను తెప్పిస్తాను," అన్నాను.

వాడు సరే నన్నాడు. నేను వాడి చేత గంగాళంలో నీరు కాగబెట్టించి, అందులో వాణ్ణి కూచోమని, గుప్పెడు గడ్డిమొక్కలు తెచ్చి, వాడి కళ్ళకు పట్టీ వేస్తున్నట్టు వేస్తూ, వాడి మంచి కన్ను కూడా పొడిచేశాను.

టి. వెంకటరావు

నేను తనను గుడ్డివాణ్ణి చేశానని గ్రహించగానే వాడు గంగాళంలో నుంచి ఒక్క దూకు దూకి, వెళ్ళి గుహ ద్వారానికి అడ్డంగా కూర్చున్నాడు. అక్కడ కూర్చుని వాడు నన్ను రకరకాలుగా తిట్టసాగాడు.

నేను ఆ రాత్రి అంతా గుహగోడను కరుచుకుని కూర్చున్నాను. గట్టిగా ఊపిరి తీస్తే వాడికి నా జాడ తెలిసిపోతుందని ఎంతో భయపడ్డాను.

తెల్లవారి పక్షుల కలకలం వినిపించగానే ఆ రాక్షసుడు నాతో, "నిద్రపోతున్నావా? నా మేకలను విప్పు" అన్నాడు.

నేను నా వేట కత్తితో వాడి లేడిని చంపి, దానితోలు ఒలవటం మొదలు పెట్టాను.

"ఏం చేస్తున్నావు?" అన్నాడు రాక్షసుడు.

"ముడులు ఒకంతట రావటం లేదు, చాలా గట్టిగా ఉన్నాయి," అన్నాను.

తరవాత ఒక్కొక్క మేకనే వదిలాను. రాక్షసుడు ఒక్కొక్క మేకనే తడివి గుర్తు పట్టుతూ, "తెల్లమేకా, నిన్ను నేను చూడ లేను గాని, నన్ను నువు చూడగలవు గద!" అంటూ ప్రతి మేకనూ పేరుపేరునా పలక రించి బయటికి పోనిచ్చాడు.

చివరకు లేడితోలు కప్పుకుని పాకు కుంటూ నేను బయటికి బయలుదేరాను. రాక్షసుడు లేడిచర్మం మీద నిమిరి, "అయ్యో, నా లేడీ, నేను నిన్నుచూడలేను గాని నువు



నన్ను చూడగలవు గద!" అంటూ నన్ను బయటికి పోనిచ్చాడు. గుహ దాటి రాగానే నాకు ఆకాశమూ, సముద్రమూ, ఎండా కనిపించి ప్రాణం లేచి వచ్చినట్టయింది.

ఆ ఆనందంలో, "ఒరే, గుడ్డివెధవా! నన్ను పట్టుకోలేక పోయావు!" అని కేకలు పెట్టాను.

రాక్షసుడు నా కేకవిని, "ఎంత మొన గాడివిరా! మెచ్చుకున్నాను. నా జ్ఞాపకార్థం ఈ ఉంగరం తీసుకో!" అని పిలిచాడు.

"నేను ఉంగరం కోసం నీ దగ్గిరికిరాను. దాన్ని నా కేసి విసురు," అన్నాను.

రాక్షసుడు ఒక ఉంగరాన్ని నా దిక్కుగా విసిరాడు. నేను దాన్ని నా వేలికి తగిలించు

కున్నాను. "ఉంగరం నీ వేలికి సరిపోయిందా?" అని రాక్షసుడు అడిగాడు.

"చక్కగా సరిపోయింది," అన్నాను.

రాక్షసుడు పెద్దగా నవ్వి, "ఉంగరమా ఎక్కడ ఉన్నావు?" అని కేక పెట్టాడు.

"ఇక్కడే ఉన్నాను!" అని నా వేలి ఉంగరం జవాబిచ్చింది.

దాని ధ్వనిని బట్టి రాక్షసుడు నా కేసి రాసాగాడు. నాకు పెద్ద ప్రమాదం దాపరించింది. ఉంగరం తీద్దామంటే ఒకంతట వచ్చేటట్టు కనబడలేదు. నా కత్తితో ఉంగరం వేలు కోసేసి, ఉంగరంతో సహా దాన్ని దూరంగా సముద్రపు అగాథంలోకి విసిరేశాను.

ఈ లోపల రాక్షసుడు ఉంగరాన్ని, "ఎక్కడ వున్నావు?" అని అడుగుతూ ముందుకు వస్తున్నాడు. ఉంగరం సముద్రంలో నుంచి, "ఇక్కడే వున్నాను," అని జవాబిచ్చింది. రాక్షసుడు సముద్రంలోకి పరిగెత్తుకుంటూ వెళ్ళి, అగాథంలో పడి, మునిగి చచ్చిపోయాడు.

తరవాత నేను రాక్షసుడి గుహకు తిరిగి వెళ్ళి, అక్కడ ఉన్నదంతా కొల్లగొట్టి, ఎలాగో ఇల్లు చేరుకున్నాను.

వీరదాసు ఈ సంఘటన చెప్పి, "ఆ నాడు నా కెదురైన ప్రమాదం చాలా గొప్పది. నా ఉంగరం వేలు పోయిందే గాని నాకు మరే అపాయమూ కలగలేదు," అంటూ తన చెయ్యి ఎత్తి చూపాడు. ఆ చేతికి ఉంగరంవేలు లేదు.

శ్యామలనగర రాజు అతని కథ విని, "నీ కథ అద్భుతంగా ఉన్నది. అది నిజమని నాకు నమ్మకం కుదిరింది. నీ కథలతో ఇద్దరు కొడుకులను కాపాడుకున్నావు. అలాటి కథ మరొకటి ఉంటే చెప్పి నీ మూడో కొడుకు ప్రాణాలు కూడా కాపాడుకో," అన్నాడు.

వీరదాసు కొంచెం ఆలోచించి, "నా జీవితంలో ఇంతకన్న కూడా ప్రమాదకరమైన సంఘటన జరిగింది," అన్నాడు.

"అయితే చెప్పు!" అన్నాడు రాజు.

—[పై సంచికలో మరొక కథ]





# పంచకల్యాణి

## 4

శ్యామలనగరం రాజు అడిగిన దానికి వీరదాసు యిల్లా చెప్పసాగాడు:

రాక్షసుడి గుహ నుంచి వచ్చిన కొద్ది కాలానికే నాకు మా వాళ్ళు పెళ్ళి చేశారు. నేను కూడా సంచారాలు కట్టి పెట్టి ఇంటి పట్టునే ఉంటూ వచ్చాను.

కాని, తిరిగే కాలు ఊరుకుంటుందా? ఒకనాడు సముద్రతీరాన వేటాడబోయాను. సముద్రం ఒడ్డున ఒక అందమైన పడవ కనిపించింది. అది ఏమిటో చూద్దామని అందులోకి ఎక్కాను. దానిలోపల ఎంతో విలువగల వస్తువులూ, అందమైన వస్తువులూ అనేకంగా ఉన్నాయి. నేను వాటిని చూసి ఆనందపడే సమయంలో పడవ దానికదే కదిలి సముద్రం మీదికి ప్రయాణమయింది.

నేనీ సంగతి గమనించేసరికి పడవ సముద్రం మీద అమితవేగంగా పోతున్నది. కాని నే నేమీ కంగారు పడలేదు. అది అలా వెళ్ళి వెళ్ళి ఒక దీవిని చేరుకుని, దాని ఒడ్డును ఒరుసుకుని ఆగిపోయింది. ఆ దీవి నే నెన్నడూ చూడలేదు. అక్కడ ఏమున్నదో చూదామని పడవలో నుంచి ఒడ్డుకు దిగాను. వెంటనే ఆ పడవ గిరుక్కున తిరిగి, వచ్చిన దారినే వెళ్ళిపోయింది. నేనా దీవి మీద చిక్కుపడిపోయాను.

దీవి మీద ఎక్కడా నరసంచారం ఉన్నట్టు లేదు. కనుచూపు మేరలో ఒక్క ఇల్లు కూడా లేదు. నేను సముద్రతీరం నుంచి ఒక గుట్ట ఎక్కేసరికి, ఆ ఎత్తున పీఠభూమి కనబడింది. నేనక్కడికి చేరుతూనే స్తంభించిపోయాను. ఎందుకంటే, చెట్ల మధ్య ఖాళీస్థలంలో ఒక స్త్రీ ఒక పసిపిల్లవాడి కంఠానికి కత్తిమొన అనించి, పొడవబోతున్నది!

టి. వెంకటరావు



ఆ పిల్లవాడు కేరింతాలు కొడుతూ, తళ తళలాడే ఆ కత్తిని తన చిన్న చేతులతో పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. అది చూసి ఆ స్త్రీ కత్తి అవతల విసిరేసి, గుండె పగిలేటట్టు ఏడుస్తూ, "నా పల్ల కాదు! నా వల్ల కాదు!" అన్నది.

నే నామె దుస్థితి గ్రహించి, దగ్గిరికి వెళ్ళి, "ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని అడిగాను.

ఆమె నా గొంతువిని, పిల్లవాణ్ణి తన గుండెకు అదుముకుంటూ లేచి, పారి పోబోయింది. కాని నేను పరిగెత్తి వెళ్ళి ఆమెను చేరుకుని, "భయపడకు. నేనూ నీ స్థితిలోనే ఉన్నాను," అన్నాను.

"అది నిజమే. కాని ఇక్కడికి ఎలా వచ్చావు?" అని ఆమె అడిగింది.

నేను నా అనుభవమంతా చెప్పాను.

"నేను కూడా నీలాగే ఇక్కడికి అనుకో కుండా వచ్చి చేరాను. పిల్లవాణ్ణి ఎత్తుకుని సముద్రతీరాన నడుస్తూ పడవను చూసి, నేరక అందులోకి అడుగు పెట్టాను. ఏమి జరిగినదీ తెలుసుకునే లోపల పడవ ఈ దీవికి చేరనే చేరింది. దీవిలోకి అడుగు పెట్టటం ప్రమాదమని నేను కలలో కూడా అనుకో లేదు. నేను దిగిన మరుక్షణం పడవ వెళ్ళి పోయింది. ఇక్కడ చిక్కుపడిపోయాను. నువ్వయినా ఇక్కడి నుంచి తప్పించుకు పోలేవు," అన్నదామె.

ఆమె వెనకగా నేను రాళ్ళతో కట్టిన ఒక వంట ఇంట్లోకి నడిచాను. అందులో ఒక పక్కగా పెద్దగంగాళం ఉన్నది. దాని కింద కొద్దిపాటి మంట ఉన్నది.

"నీ కొడుకును ఎందుకు చంప బోయావు?" అని అడిగాను.

"నా ప్రారబ్ధం ఏమని చెప్పను? వీణ్ణి రాక్షసుడికి వండి పెట్టాలి. అందుకే గంగాళం కింద మంటచేశాను," అన్నదామె కన్నీరు కార్చుతూ.

నీరు త్వరగా మరగకుండా మంట చిన్నది చేసిందిట. కాని రాక్షసుడు వచ్చి మంట పెద్దది చేస్తాడు.

ఆమె ఆ మాట అంటూండగానే భూమి అదిరింది. రాక్షసుడు దూరాన వస్తున్నట్టు తెలిసింది.

"ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?" అని ఆమె లబలబలాడింది.

"నీ పిల్లవాణ్ణి ఎక్కడన్నా దాచు! నేను గంగాళంలో కూర్చుంటాను," అంటూ నేను గంగాళంలోకి చేరి, పైన మూత వేసుకున్నాను. అదృష్ట వశాన నీరు ఇంకా అంతగా వేడెక్కలేదు.

రాక్షసుడు వస్తూనే ఆమెను, "పిల్లవాణ్ణి ఉడకబెట్టావా?" అని అడిగాడు.

"ఇంకా నీరు మసులు పట్టలేదు," అన్నదామె.

నేను నీటిలో నుంచి బుడగల చప్పుడు చేశాను. అది పిల్లవాడే చేస్తున్నాడనుకుని, రాక్షసుడు పొట్ట ఎగిరేటట్టు నవ్వుతూ, గంగాళం కింద మంట పెద్దది చేసి, దాని పక్కనే నడుము వాల్చాడు.

క్రమంగా గంగాళంలో నీరు వేడెక్క సాగింది. నేను అందులో ఉడకక తప్ప దనుకున్నాను. గంగాళం కింది భాగం భరించరానంతగా వేడి ఎక్కింది.

ఇంతలో రాక్షసుడు గురకపెట్టనారంభించాడు లాగుంది. ఆమె గంగాళం మూత ఎత్తి, "బతికి ఉన్నావా?" అని రహస్యంగా అడిగింది.



"కొసప్రాణం ఇంకాపోలేదు," అన్నాను, మూత ఎత్తి, గంగాళంలో లేచి నిలబడి. రాక్షసుడు మంచి నిద్రలో ఉన్నాడు. నేను గంగాళంలో నుంచి శ్రమపడి దిగాను. కాని తరవాత ఏం చెయ్యాలి?

ఆమె సైగచేసి, రాక్షసుడి పక్కన ఉన్న బల్లెం చూపించింది. అది చాలా పెద్దది. నేను ఆ బల్లెం పట్టుకుని ఎత్తాను. అది చాలా బరువుగా ఉన్నది. ఎలాగూ చావు తప్పేదారి లేదు. ఆ బల్లాన్ని రెండుచేతులా ఎత్తి, నాకున్న శక్తి అంతా ఉపయోగించి రాక్షసుడి కళ్ళమధ్య దిగవేశాను. అది వాడి తలను దూసుకుని, జానెడు లోతున భూమిలోకి దిగబడి పోయింది. రాక్షసుడు

కిక్కురు మనకుండా చచ్చాడు. నా ఆనందం ఏమని చెప్పను!

ఆ స్త్రీనీ, పిల్లవాణ్ణీ వెంట బెట్టుకుని సముద్రతీరానికి వచ్చాను. అక్కడ పడవ సిద్ధంగా ఉన్నది. మేం దానిమీద ఎక్కేసరికి, అది బయలుదేరి, తిరిగి మా తీరానికి వచ్చేసింది. తరవాత ఆమె దారిన ఆమె పిల్లవాడితో సహా వెళ్ళిపోయింది.

వీరదాసు ఈ సంఘటన చెప్పి, "ఈ సంఘటనను మహారాజుగారు నమ్ముతారో, లేదో!" అన్నాడు.

అదేక్షణంలో, రాజుగారి వెనక ప్రాంతం నుంచి ఒక వయసు మళ్ళిన స్త్రీ ముందుకు వచ్చి, "ఆ నాడు నన్ను ఆ రాక్షసుడి నుంచి కాపాడిన వాడివి నువేనా నాయనా?" అన్నది ఆశ్చర్యంతో.

వీరదాసు ఆమెను కొంచెంగా గుర్తుపటుతూ, "అవునమ్మా, నేనే!" అన్నాడు.

"ఈ రాజే ఆ నాడు నువు రక్షించిన కుర్రవాడు! నీకు మేమిద్దరమూ ఎంతగా రుణపడి ఉన్నామో!" అన్నదామె.

ఇన్నిఏళ్ళ తరవాత వాళ్ళు మళ్ళీ తిరిగి కలుసుకోవటం ఎంతో ఆనందం కలిగించింది.

"వీరదాసూ, నువు నిజంగా గొప్ప ధీరుడివి. నీకు కలిగిన ప్రమాదాలు సామాన్యమైనవి కావు. నా పంచకల్యాణి గుర్రం నీదే. దానితోబాటు నా ఖజానాలో ఉన్న అమూల్యమైన రత్నాలన్నీ నీకు బహుమానంగా యిస్తాను," అన్నాడు శ్యామల నగరరాజు.

ఆ రాత్రి వీరదాసు గౌరవార్థం పెద్ద విందు జరిగింది.

మర్నాడు అతను రాజుకూ, రాజమాతకూ వీడ్కోలు చెప్పి, తన కొడుకులతోనూ, పంచకల్యాణి గుర్రంతోనూ, శ్యామలనగరరాజు ఇచ్చిన కానుకలతోనూ బయలుదేరి తన నగరానికి తిరిగి వచ్చాడు.

పంచకల్యాణి లభించినాక అతని ప్రభువు అతని కొడుకులను క్షమించి, సుఖంగా జీవించనిచ్చాడు.

—(అయిపోయింది)

